Reg. No. 757

# అభినవసరస్వతి



యను నొక మాసపత్రిక.

నాగరఖండ స్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథకర్తయగు
జనపాటి పట్టాభిరామశాస్త్రిచేత
ప్రకటింపఁబడుచున్నది.

జనపాడు.

సంపుటము 20 { 1929 సం॥ ఫిబ్రవరి నెల } సంచిక 11

విషయములు.



చందానిర్ణయము సంవత్సరమునకు

ప్రధానపోషకులకు రు 25 0 0 సహాయులకు రు 5 0 0

పోషకులకు రు 10 0 0 చందాదారులకు 3 0 0

Printed at the Chandrika Press, Guntur,
and published at Janapadu by the Editor, Astavadhani
Janapati Pattabhirama Sastry,
author of Nagarakhandam, Swarnakaravyavaharam
etc., etc.

## ప్రధానపోషకులు.

౧ శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్ష స్వాములవారు, కొండారెడ్డిపల్లె.
౨ శ్రీ శ్రీ జగద్గురు పుష్పగిరి స్వాములవారు, జగితాల.
౩ బాకరాజు పర్మాంకుశరావుదేశాయిగారు. యాదవగం.
౪ రామసింగుగారు- నెల్లుట్లపాపురసంస్థానముల మేనేజరు- నెల్లుట్ల.
౫ శ్రీమద్వేంకట శేషారెడ్డి రామచంద్రారెడ్డి దేశముఖుగార్లు, అల్లాదుర్గసంస్థానము.

## పోషకులు.

౧ రాజా వెంకటాద్ర్యప్పారావు, బహదరు జమీందారుగారు-నూజవీడు.
౨ గూడూరి వీరసాంబశివరావు సర్దేశపాండ్యాగారు, మానెకొండూరు
౩ జాగర్లమూడి కుప్పస్వామినాయుడుగారు, కారంచేడు
౪ నెల్లుట్ల నరసింహారావుగారు, జనగాం
౫ లింగాల వెంకటరెడ్డి దేశముఖుగారు, కుందవరము
౬ రంగాచార్యులుగారు, ముక్త్యారు, దేశముఖు, నసీదుపల్లె.
౭ చారబుడ్డి రత్నారెడ్డిపటేలుగారు, న్యాలపోగుల
౮ రామగూంబికా పుస్తకభాండాగారము, లక్ష్మీనర్సాపురము.
౯ తంగెడ నరసింహారావుగారు, కరణం, మోర్జంపాడు.
౧౦ టి. లక్ష్మణసింగుగారు, జనగాం
౧౧ రాజా మంత్రిప్రగడ వెంకటహనుమంతరావు, రాఘవరావుగార్లు, లింగగిరి.
౧౨ పిసుపాటి వెంకటరాయశర్మగారు, కరవది
౧౩ శ్రీ శ్రీ జగద్గురు అభినవ విరూపాక్ష పీఠాధిపతులు, కాకినాడ.
౧౪ శ్యామాపంతుల వెంకటేశ్వరరావుగారు, తహశీల్దారు, పాకాల.
౧౫ కొత్వాలి వెంకటేశ్వరరావుగారు, సంగెం
౧౬ లింగాల రంగారెడ్డి దేశముఖుగారు, గణపురం,
౧౭ రాజా కందుకూరు సూర్యప్రకాశరావు బహద్దరు, జమీందారుగారు-దేవిడి.
౧౮ సాకుంట కిషన్‌రావు దేశముఖ్ గారు, జరితాల.

## సహాయులు

౧ కాకుమాను హనుమయ్యగారు, నర్సారావుపేట
౨ మెదక్ కిషన్‌రావు దేశముఖుగారు, నల్లపల్లి
౩ బీరకాయల హనుమంతరావు దేశపాండ్యాగారు, రాయగిరి
౪ లక్ష్మీనరసింహస్వామివారు, యాదగిరి
౫ నెల్లుట్ల కేశవరావు దేశముఖుగారు, పాపురం.
౬ వావిళ్ల వెంకటేశ్వరశాస్త్రులుగారు, చెన్నపట్టణము.
౭ పెద్దిభట్ల వీరయ్యగారు, ప్లీడరు బెజవాడ
౮ తిప్పరాజు కామేశ్వరరావుగారు, కరణం, దుగ్గిరాల

అభినవ సరస్వతి

| సంపుటము | జానపాడు | సంచిక |
|---|---|---|
| ౨౦ | విభవ సం॥ మాఖమాసము. | ౧౧ |




# శ్రీకాశీక్షేత్రమునందు జరుపఁబడిన అఖిలభారతవర్షీయ బ్రాహ్మణమహాసమ్మేళనమునందు స్వాగతాధ్యక్షులయిన

శ్రీమన్మహారాజాధిరాజ ద్విజరాజ కాశీరాజ శ్రీ ౧౦౮ మత్ హిజ్, హైనెస్, లెఫ్టినెంట్ కర్నల్ సర్ ప్రభునారాయణ సింహాబహాదూర్, జీ. సీ. ఎస్. ఐ., జీ. సీ. ఐ. ఈ. ఎల్. ఎల్. డీ. మహోదయులవారి

## స్వాగత సంభాషణము.

శ్లో॥ యో గఙ్గాం సహసా ముదావహ దయం లీలావపుర్లీలయా
యో వాలం విపదో రరక్ష నియతం మృత్యోః కరాళాస్యతః,
క్షీరోదప్రభవా ప్తభూషితతనుర్దేవాదిదైన్యార్తిహృత్
పాయాద్ దంధకనిగ్రహః ప్రభురసౌ వస్మాన్ సదో మాధవః. ౧

శ్లో॥ అజ్ఞానాంధతమోధ్వంసి జ్ఞానాలోకప్రదాయినే,
శంకరాయ నమస్కుర్మో౽ద్వైతమార్గప్రదర్శినే. ౨

ఆర్యులారా ! ఈబ్రాహ్మణమహాసమ్మేళనమునఁ బూజనీయులయిన యాచార్యులను ఋషికల్పులగు బ్రాహ్మణపండితులను మాన్యులయిన సభ్యులను బ్రార్థించుటకు నే నాజ్ఞాపింపఁబడినాఁడను. శ్రీమంతులయిన పండితమహోదయులచేతను సభ్యమహాశయులచేతను సభ్యర్థనాసమితికి సభాపతిగా బహుమానింపఁబడిన నే నిచ్చటికి దయచేసినవారును, నానాదిగంతపావనులునునయిన యాచార్యులను బ్రాహ్మణులను నభివాదనపూర్వకమయిన స్వాగత సంభాషణముచేఁ బ్రార్థిం

చుచున్నాఁడను. పూజ్యతములును సనాతనధర్మసంప్రదాయప్రతిష్ఠాపకులును నగు నాచార్యవర్యులారా! సమస్తశాస్త్రముల తత్త్వము నెఱింగిన పండితమహాశయులారా! సభ్యమహాశయులారా! మన మిపుడు కూడియున్న యీక్షేత్రము విశ్వేశ్వరరాజధాని యనియు, మోక్షనగరి యనియు వారాణసి యనియు మీ రెఱింగినదియే. ఇది స్మరణాతీతకాలమునుండి నేఁటివఱకును వేదములయందును ప్రకాశమానములయిన యితిహాసములయందును నుపనిషత్తులయందును రామాయణమహాభారతములయందును మోక్షనగరి యనియుఁ బ్రసిద్ధజనపదమనియు సురాజపాలితమనియు సమస్తపురాణోప పురాణ కథాఖ్యాయికా కావ్యాలంకార నాటకజ్యోతిషాదిశాస్త్రములయందును సామాన్యముగా నష్టాదశవిద్యాస్థానములయందును సూచింపఁబడిన మాహాత్మ్యము గలదియై విరాజిల్లుచున్నది.

సనాతనసదాచారలీలాభూమియు నష్టాదశవిద్యాపీఠస్థలియు నాచారహీనులును నిజవర్ణోచితవ్యవహారముల మఱచినవారును శోకతాపక్లిష్టులును నగు వారికి సదాచారవ్యవహారశిక్షాదానముచే సమస్తఖేదములను హరించునదియు నగణితభక్తబృంద ప్రతిష్ఠాపితానేకవిధశిల్పకార్యసుశోభితగాత్రియు నర్ధచంద్రాకారయునగు గంగానదిచే నవధౌతపాదయుఁ బురహరప్రియయు నగు నీమహానగరి కాశి యనియు వారాణసి యనియు నవిముక్తమనియు రుద్రావాసమనియు మహాశ్మశాన మనియు నానందకానన మనియు బనారసనియు వ్యవహరింపఁబడుచున్నది.

నిర్వాణప్రకాశనమువలనఁగాని కాశరాజున కావాసమగుట వలనఁ గాని కాశియనియు వరణాసీనదులమధ్యనుండుటవలన వారాణసి యనియుఁ బార్వతీపరమేశ్వరులచే విడువఁబడకుండుటంజేసి యవిముక్తమనియు సమస్తరుద్రులకును నావాస మగుటచే రుద్రావాసమనియు మహాప్రళయమునందుఁగూడమహాభూతము లిచ్చట శివరూపమున నుండుటంజేసి మహాశ్మశాన మనియు నానందదాయకమయినందున నానందకానన మనియు యవనారి యను పేరఁ బ్రసిద్ధుఁడయిన చంద్రవంశపురాజునకు రాజధాని యగుటచే బనారసనియు సంజ్ఞాకరణములు వేదపురాణేతిహాసకావ్యాదులయందుఁ దెలియఁబడుచున్నవి.

ఇందు విశ్వవిశ్రుతకీర్తులును విజ్ఞానశాలులును, ధార్మికచూడా మణులును సుగృహీతనామధేయులును నగు ధన్వంతరి దివోదాసుఁడు ప్రతర్దనుఁడు నలర్కుఁడు నజాతశత్రుఁడు మొదలయినరాజు లుండిరి. ఉత్తమక్షత్రియులగు వారిచేతనే యాయుర్వేద బ్రహ్మవిద్యాసంప్రదాయము ప్రవర్తింపఁజేయఁబడినది. మఱియు నిందుఁ ద్రికాలదర్శులును నిఖిలతత్త్వముల నెఱింగినవారును నగు కృష్ణద్వైపాయనాది మహర్షులును నెందఱెందఱో యాచార్యులును సాధువులును మునులును ఉండెడివారు. ఇప్పటికిని సదాచారపరాయణులును బంక్తిపావనులును వేదాగమరహస్యముల నెఱింగినవారును నగు బ్రాహ్మణులును బండితులును ననేకు లిందు నివసించుచున్నారు. ఇందిపుడును దేవస్థానములఁ జూడఁదలఁచినవారియొక్కయుఁ బ్రాచీనతత్త్వములఁ బరిశీలించువారియొక్కయు, శిల్పచాతుర్యము నభ్యసింపఁగోరు వారియొక్కయు నిఖిలవేదాగమశాస్త్రముల నేర్చు విద్యార్థులయొక్కయు సముదాయము చూడఁబడుచున్నది.

ఇందుఁ గాఁపుర ముండువారు మహాసౌభాగ్యభూము లనియు శివస్వరూపు లనియుఁ బురాణాదులయందు వినుచున్నాము. తీర్థగౌరవము నంగీకరించువారికిని సదాచారపరంపరారక్షణవ్రతులకును ధార్మికులకును వెనుకటిరీతిని నిర్విఘ్నముగా నవస్థానసంభావన కనుపడుటలేదు. అందును నిప్పటియువకులును ననేకులు సామాజికులును బ్రకృతినిబట్టియుఁ గాలమునుబట్టియు విద్యాభ్యాసమునుబట్టియు నితర సమాజప్రవిష్టులై కోటరస్థవహ్నులగు వృక్షములు, వనమునువలెఁ బుత్త్రిలు కులమునువలె నదీవేగములు తీరములనువలె వర్ణాశ్రమాచారములను సనాతనమర్యాదలను విధ్వంసము చేయుచున్నారు. అందును గొందఱు మనీషు లీధర్మవిప్లవమును బ్రతిక్రియ చేయుటకు వీలుగాని దానినిగా నాలోచించుచున్నారు. కొందఱు విధ్వంసమునకు సాయపడుచున్నారు. కొందఱు యథాశక్తి ప్రతీకారమునకుఁ బ్రయత్నించుచున్నారు. వారిలో నెవ రుదాసీనులో యెవరు విధ్వంససహాయకులో వారు పాశ్చాత్యవిద్యాభ్యాసప్రభావముచే సనాతనధర్మవిరోధులు. ఎవరు సదుపదేశములచే సన్మార్గాభిలాషులై ప్రతీకారమునకుఁ బ్రయత్నించుచున్నారో వారు ప్రభుశక్తిసంపన్నులయిన ధార్మికుల

చేతను సామాజికులచేతను సర్వశక్తులచేతను దేశములకొఱకును వర్ణాశ్రమపరాయణుల యభ్యుదయముకొఱకును బనిచేయఁజాలువారు గాఁబ్రోత్సహింపఁదగియున్నారు. ఈధర్మవిప్లవమును మనకుఁగ్రొత్తది కాదు. ఇతిహాసపురాణాదులయందుఁ బ్రతియుగమునందును రాగప్రాప్తమైనయీధర్మవిప్లవమును వినుచునేయున్నాము. అచ్చటచ్చట నాపదల నన్నింటిని దాఁటి యీసనాతనధర్మము సర్వోపరి ప్రవర్తించుచున్నది.

త్రికాలదర్శియు భగవానుఁడును నగు కృష్ణద్వైపాయనుఁడు ద్వాపరయుగాంతమున "ఊర్ధ్వబాహుర్విరౌమ్యేష నచకశ్చిచ్ఛృణోతి హి, ధర్మాదర్థశ్చ కామశ్చ స కిం ధర్మో న సేవ్యతే?" (ఇదిగో నేను చేయి మీఁదికెత్తి మొఱలిడుచున్నాను. ఒక్కఁడును వినఁడు గదా! ధర్మమువలననే యర్థము, కామము కలుగుచుండును. అట్టిస్థితిలో నట్టిధర్మము నెందులకు సేవింపరు) అని యన్నాఁడుకూడను. కృతయుగమున హిరణ్యకశిపు మొదలగు రాక్షసులవలన ధర్మమున కుపద్రవము వాటిల్లినది. త్రేతాయుగమున రావణాదులగు రాక్షసులవలన ధర్మవిప్లవము కలిగినది. ద్వాపరయుగమున నధార్మికులయిన రాజులవలన ధర్మవిప్లవముగలిగినది. ఈకలియుగమునందును నధార్మికులైన రాజులు జైనులు బౌద్ధులు మ్లేచ్ఛులు మొదలగువారివలన ధర్మమునకు ముప్పు తప్పినదిగాదు. అటువంటివిప్లవమును బోఁగొట్టుటకును ధర్మస్థితికొఱకును సాధుసంరక్షణకొఱకును నాయాసమయములయందు భగవంతుఁడవతరించుచుండెను. ఒకప్పుడు తదంశావిష్టులును నొకప్పుడు తదనుగృహీతులయిన మీవంటిసమాజమూర్ధన్యులయిన బ్రాహ్మణులునే సమాజస్థితిని గల్పించియున్నారు. ఓహో! పండితులారా! సామాజికులయందు సర్వవిధధర్మకార్యాద్యనుష్ఠానముకొఱకు మీకున్నట్టుగా సంబంధమితరులకు లేదు. కాఁబట్టి యనాచారదోషమువలనఁ గలిగిన యనారోగ్యాకాలమృత్యు పరకీయరమణీయతాడులగు దోషసముదాయమును జూపుచుండెడి మీరే యటువంటి యనాచారాదులను మొదలంట నుచ్ఛేదింపవలసినవా రగుచున్నారు.

ప్రభుశక్తిసంపన్నులును శాస్త్రవాక్యములను బాలించుచుఁ దమకు సాహాయ్యమును సంపాదించుటకు శక్తిగలవా రగుచుందురు. ఆచరణము ప్రచారణము నధ్యయనము నధ్యాపనము ననువీనిచే మీరు

మాత్రమే సనాతనధర్మమును రక్షించుటకును దృఢపఱచుటకును సమర్థులగుచున్నారు. ఇట్లిప్పటికిని నాప్రకారముగా ననుష్ఠానములో నుంచుచున్నారుకూడను. నానావిధకార్యవ్యాపృతులయిన పాలక సంప్రదాయుల యాచరణాతిరిక్తమయిన ధర్మసంరక్షణోపాయ మగ పడకున్నది. ఇపుడు విప్లవవాదులు సమర్థులగుటకు సామాజికుల యొక్కయుఁబూజ్యులయిన పండితులయొక్కయుఁ బ్రయత్నశైథిల్యమే కారణమనకతప్పదు. నిశ్చయముగా సామాజికులును మీరును నప్పుడే నడుముగట్టుకొని సర్వవిధముల నివారించుటకుఁ బ్రయత్నించియుండిన పక్షమున నింతటిధర్మవిప్లవము జరిగియుండకపోవును. ఏప్రకారముగా జైనబౌద్ధమ్లేచ్ఛాదులవలనఁ గలిగిన దుర్దినములలో సర్వకర్మములను మఱచినవారును సుగృహీతనామధేయులును నాచార్యవర్యులును నగు కుమారిల ప్రభాకరశంకరవాచస్పత్యుదయన ప్రభృతులకును బండితప్రకాండులకును ధర్మరక్షణకొఱకు యత్నమావశ్యకమైనదో యదే ప్రకారముగా నిపుడు మీకును నావశ్యకమయియున్నది.

ఇప్పటిసామాజికులాచార్యపాదుల వారి దయచేతనే వర్ణాశ్రమాచారములను విలోకించుటకు సమర్థులగుచున్నారు.

వెనుకను వేయిసంవత్సరములు జైనబౌద్ధమ్లేచ్ఛులు స్వతంత్రధర్మమతములను బ్రచారమునకుఁ దెచ్చినవారై యార్యధర్మమును విధ్వంసము చేసియుండిరి. అప్పుడును నతిదుర్గమప్రదేశములయినను లక్ష్యపెట్టక యక్కడక్కడకు వెళ్ళి శంకరాచార్యభగవానులవారీభారతవర్షమునం దంతటను నార్యధర్మమును మరల స్థాపించి వర్ణాశ్రమాచారములకు బహిర్భూతములయిన యితరధర్మమతములను నిరాకరించిరి. ఆయాకథయంతయు మీ కెఱింగినదియే. అప్పుడును భారతీయులగురాజు లనేకులు వర్ణాశ్రమధర్మవిరోధులై యుండిరి. ప్రభుశక్తియు సంఘశక్తియుఁ బ్రాచీనాచారమును లోపింపఁజేయుటకుఁ బ్రయత్నించినవి. అప్పటికిని సనాతనధర్మము నష్టముకాలేదు. అట్టిది యిప్పుడెట్లు నశించును? ఆలోచింపఁగా రాజశక్తి ప్రత్యక్షముగా ధర్మమును లోపింపఁజేయుటకై ప్రవర్తింపలేదు. కానియౌదాసీన్యమును వహించినట్టుమాత్రము కనుపట్టుచున్నది. కేవలము సామాజికుల యుత్సాహాభావమే ధర్మస్థితి తగ్గుదలకు హేతువని తలంచెదను.

నిజముగా సామాజికులు పరిణామము తెలియనివిషయముల యం దంధులచందానఁ బ్రవర్తింపకున్న పక్షమున నింతటివిప్లవమునుఁ దట స్థింపకుండెడిది. మన యాచారవ్యవహారములను విడుచుటకుఁ బరులు ప్రభువులును గాకుందురు. ఇతరులనే మనము దూషింపకుందుము.

ఆశామరుమరీచికలచే నపహృతవిజ్ఞానులై సామాజికులును శాస్త్రరహస్యముల నెఱుఁగనిపండిత విశేషులును నిజధర్మాచారబహి ర్భూతమయిన విద్యాపద్ధతిని సమర్థింపకయును వైదేశికభాషావిజ్ఞాన శిక్షణముకొఱకుఁ దమతమపుత్త్రుల ననార్యాచారదూషితములైన యట్టి విద్యాలయములకే పంపకయు నుండినపక్షమునఁ బ్రపంచమునం తను బ్రమింగఁదగిన యింతటివిప్లవము సంభవింపకుండెడిది. ఇదిమో హమా ? అవిమృశ్యకారిత్వమా ? అంధవిశ్వాసమా ? గతానుగతిక న్యాయమా ? కాలమహిమయా ? ఏదోయొకటి యగుఁగాక. ఉపేక్షిం పఁబడినరోగములాగున నీయుపద్రవము గొప్ప యనర్థమునిమిత్తమే యేర్పడినది. ఎవ రాదర్శపాత్రులో యెవరు ధర్మప్రవక్తలో యెవరు సమాజమర్యాదాపర్వతభూతులో వారే నిష్కారణముగ విచలితులై నప్పుడు సామాజికు లెట్లు విఘటింపకుండెదరు ? సాధారణములయిన భోగసాధనములయున్నతిని గోరి కాని భవిష్యద్వంశధరుల స్వాధీన జీవికకొఱకుఁగాని తమవృత్తులయం దశ్రద్ధచేతనుగాని ధనికుల ద్వార ములయొద్దకుఁ బోవునప్పటి కష్టములను సహింపలేమిచేతనుగాని యీ ప్రవృత్తి పండితులయందుఁ గలిగినదని మనమెఱుంగము. కాని విచార దృష్టిచేఁజూచినచో నిదిసమంజసముగాదు. భోగసాధనముల నౌన్నత్య మును బొందించుప్రయత్నము పామరసాధారణమేయగుఁగాని తత్త్వ మెఱిఁగినవారి కం దనురాగ ముండరాదు. ఋషిప్రదర్శితమయిన స్వీయజీవికను బరిత్యజించి పరకీయులవృత్తి నవలంబించుటను స్వాధీన నామమున నెట్లు పేర్కొన వీలగును ? "స్వధర్మే నిధనం శ్రేయః పర ధర్మో భయావహః" అని యుపదేశించువారికి బ్రాహ్మణుల కుచితము లయినవృత్తులయం దశ్రద్ధ యెట్లు కలుగఁగలదు? ధనికులద్వారముల యొద్దకుఁ బోవునప్పటి కష్టముల కథకూడ నంతకంటెను బహుతరజనా నురోధాదులవలనఁ గలిగెడిక్లేశ ముండనేయున్నది గనుకను విచార సహముకాదు. ఎవరు పాశ్చాత్త్యవిద్యాశిక్షితులై శిఖాయజ్ఞోపవీత

ములను ధరించువిద్వాంసులను గడకంటనైనను జూడనిచ్ఛగింపరో మఱి వారితో మాటలాడరో యట్టివారియిండ్లకుఁ బోవుటకంటెను స్వాగతాభివాదనాదిపరాయణులును నేమేని యీయఁదలఁచుకొన్న వారును దాతలును నగువారిండ్లకుఁ బోవుటలో నేమి కష్ట మున్నది? అసంభావన యేమున్నది? ఇప్పట్టున "స్వార్థే కస్మిన్ సమీహా పునరధికతరే త్వా మనార్యం కరోతి" అను ముద్రారాక్షసనాటకములోని మలయకేతువచనము జ్ఞప్తికి వచ్చుచున్నది. అట్టి ప్రయత్నము తనకును వంశధరులకును సుఖవిఘాతమునకే యగు నందురేని మా చెప్పునది వినుఁడు. మనుజులలో స్వతంత్రబుద్ధు లనియుఁ బరాధీనబుద్ధు లనియు రెండుతెగలవా రున్నారు. స్వతంత్రబుద్ధులు దుర్లభులే యనవచ్చును. పరాధీనబుద్ధులో యెక్కడఁబట్టిన నక్కడనే కలరు. వారును గతానుగతికన్యాయము ననుసరించుచున్నా రని వారిలో విదితవేదితవ్యులును లోకస్థితి నెఱింగినవారును బరిణామ మెఱింగినవారును బరిణతవయస్కులును విద్యావ్రతస్నాతులును నగు పండితప్రకాండులు కూడ సామాన్యులవలెనే సమాజమున కుపద్రవమును గలిగించు నాపద్ధతినే యెట్లనుసరించుచున్నారు? ఎల్లరు సామాజికులును బండితులును వైదేశికాచారవ్యవహారశిక్షామార్గము ననుసరించినపక్షమున నాలంబము లేక వర్ణాశ్రమాచారశిక్ష యెట్లునిలిచెడిని? ఎవరయితే వైదేశికశిక్షాచారశాలలయందు దోషములను జెప్పుచున్నారో వారే తమబిడ్డల నటువంటి శిక్షాచారశాలలయందు శిక్షణను గఱపుచున్నప్పుడింక సామాజికు లేమిచేయుదురు? తదుపదేశానుష్ఠానమా? తత్సదృశాచరణమా? అంటే, ఆచరణము కార్యకారియగున ట్లుపదేశము కార్యకారికాదని మాత్రము మేమెఱుఁగుదుము. ఈసంగతి కృష్ణభగవానుఁడే "యద్య దాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః। స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే" అని గీతలలోఁ జెప్పియున్నాఁడు.

కాఁగా నిప్పుడు బ్రాహ్మణులుసయితము వైశ్యశూద్రులకర్మములను బ్రాహ్మణేతరులు బ్రాహ్మణులకర్మములను జేయుచుండువా రచ్చటచ్చట నగపడుచున్నారు. తమతమవృత్తులయందు సంతుష్టి లేకుండుటయే యిందులకుఁ గారణము. అట్టి యసంతుష్టి కర్థకామముల యశమస్పృహయే కారణము. అట్టియశమస్పృహయును "అర్థకామ

ములే పురుషార్థములు ” అని యభిప్రాయపడువారి సాహచర్యము వలనను నుపదేశము వలనను గలిగినది.

ధర్మవిచారవిధ్వంసినియగు నిట్టియాపదను పరిహరింపఁదలఁచిన వారును బ్రాచీనాచారశిక్షావ్యవహారసమర్థులును ధర్మభీరువులును నగు సామాజికులకును బండితులకును దమయధికారమునకు లోఁబడిన పుత్రశిష్యాదులయందు దటువంటి యాచారశిక్షా వ్యవహారములను బ్రవర్తింపఁజేయుటయే తాదృశాచారాదిరక్షణోపాయ మని లౌకిక దృష్టిచేతను యుక్తిచేతను నంగీకరించెదము.

తమ యాచారమునందుఁ బుత్రాదుల ప్రతిష్ఠాపనద్వారమున విపత్ప్రతీకారము సుకర మయినట్లు వేలకొలఁది యితరప్రయత్నముల ద్వారమున సుకరముకాదు. ఇట్లే తపస్సుచేఁగూడ సాధింపవచ్చును. తపస్సువలన సాధింపరానిది లేదని పురాణాదులయందు వినఁబడు చున్నది. ఘోరమయిన యిటువంటి ధర్మవిప్లవ మేర్పడినప్పటికిని శ్రీమంతులును బూజ్యతములయిన యాచార్యులును బండితప్రకాండులును బ్రాహ్మణులును గలిసి సనాతనధర్మసంరక్షణముకొఱకు గొప్పప్రయత్నముఁజేయుచున్నందున మీప్రయత్నమును భగవంతుఁడు తప్పక సఫలముచేయునని మేమాసించుచున్నాము. ఆర్తత్రాణముకొఱకును ధర్మరక్షణముకొఱకును బ్రతిజ్ఞపట్టినయాభగవంతుఁడు మీమనోరథము నేలపూర్తిచేయకుండును ?

శ్లో॥ “ మహాగ్రాహేణ సంగ్రస్తం కాతరం శరణాగతమ్,
గజేంద్రం మోక్షయామాస సేయం పౌరాణికీ కథా.
యస్య నిఃశ్వసితం వేదా యస్యేచ్ఛాకల్పితం జగత్,
స రక్షిష్యతి ధర్మం నో యేనాచారః ప్రవర్తితః. ౧
సత్యస్సనాతనో యశ్చ ధర్మో దేవర్షిసత్కృతః,
స కథం విప్లవేభ్యశ్చ నాత్మాన ముద్ధరిష్యతి. ౨
యత్పాదపద్మ మాదధ త్పద్మనాభో హృదా స్వయమ్,
తేభ్యో జగత్పునానేభ్యో బ్రాహ్మణేభ్యో నమస్సదా ”

# బాల్యవివాహనిషేధశాసనము.

# గర్భాధానవయోనిర్ణయశాసనము.

| | | | |
|---|---|---|---|
| రిఫార్మరులు తప్పక చదువవలసిన సంగతి | } | { | పూర్వాచారపరాయణులు తప్పక చూడవలసినసంగతి, |

# హేతువాదవిమర్శనము.

("సనాతనిస్టు అను ఇంగ్లీషు పత్రిక ననుసరించి వ్రాయబడినది)

14 సంవత్సరముల లోపల బాలికలకు వివాహముగాని గర్భాధానముగాని చేయరాదనియు, అట్లు చేయువారిని కఠినముగా రాజకీయ నిర్బంధశాసనము లొనర్చి శిక్షింపవలయుననియు మనరిఫార్మరు సోదరులు చేయుచున్న యాందోళనమును చూడుడు. వీరు రాజకీయాందోళన స్వాతంత్ర్యసంపాదన వ్యాజముతో శాసన సభలకు చేరిన తరువాతరాజకీయస్వాతంత్ర్య సంపాదనమును మఱచి మతాచారవిరుద్ధములగు ఇట్టి నిర్బంధచట్టముల పైశాసనముల సభలయందు ప్రవేశపెట్టుచు నీక్రింది హేతువుల తెలుపుచున్నారు. మనరిఫార్మరు సోదరులు తమకు శాస్త్రజ్ఞానము లేనిమాటను స్వయముగానే అంగీకరించుచున్నారు. కావున మేమున్నూ శాస్త్రవాదమునువదలి హేతువాదమును లోకజ్ఞానమునుమాత్ర మాశ్రయించియే వారుచూపించిన హేతుపంచకమును విమర్శించి దానిచేతకూడా ఇట్టి నిర్బంధ శాసనములు అనర్థప్రదములని ఇట నిరూపించుచున్నారము.

పైవాదమునకు రిఫార్మరులు చూపుహేతువు లెవ్వియనఁగా:—

(1) ఈదేశమందలి బాలికలలో నెక్కువమంది సామాన్యముగ 14 సంవత్సరముల యీడు రాకముందు రజస్వలలుకారు.

(2) రజస్వలయైనంత మాత్రముచేతనే బాలికయొక్క యవయవములు గర్భము దాల్చుటకును బిడ్డనుగనుటకును దగిన యభివృద్ధిని బొంది యున్నవని తలంపరాదు.

(3) అట్టియభివృద్ధి పొందక పూర్వము గర్భములేర్పడుచుండుటవలన బుట్టినబిడ్డలు అనేకులు చనిపోవుట తటస్థించుచున్నది.

(4) పైకారణము వలననే తల్లులును, బిడ్డలును గూడఁబ్రతికియున్నప్పటికిని దుర్బలశరీరములు గలవారగుచున్నారు.

(5) దేశమందలి జాతియొక్క యారోగ్యమునకును దేహబల మునకును పై కారణముననే భంగము గల్గుచున్నది.

ఈ హేతువుల కాధారము వారివారి వట్టియూహలే కాని యంత కంటె వేఱునిదర్శనము లేమియును వారుచూపియుండలేదు. కావునఁ పై హేతువుల నొక్కటొకటిగ విమర్శింతము.

(1) వ హేతువు:—ప్రతిబాలికయును సామాన్యముగ 14 వ యేఁడు రాకపూర్వమే రజస్వలయగుచుండుట యందఱు నెఱిఁగిన విషయమే. "లయన్" అనువారు Mr. Lyon తాను వ్రాసిన మెడికల్-జూరిస్-ప్రూడెన్స్" *Medical Juris Prudence అను గ్రంథమున, "ఇండియా దేశమందలి బాలికలలో 14 ఏండ్లు రాకముందే రజస్వల లగువారు నూటికి 71 మంది కలర"నిలెక్కవ్రాసియున్నారు. దీనినిబట్టి చూడఁగాఁ పైనఁగనుపఱచిన మొదటి హేతువు వట్టియబద్ధమనిఋజు వగుచున్నది గదా! ఇఁక రెండవ హేతువును విచారింతము.

2-వ-హేతువు:—ఈ విషయమై విఖ్యాతిగల వైద్యశాస్త్రజ్ఞుల గ్రంధములనుండి ప్రమాణముల నీదిగువఁజూపుచున్నాము:—

(1)"గ్యాలబిన్" అనువారు వ్రాసిన "మిడ్వైఫరీ, (అనగా మంత్రసాని శాస్త్రము) (Gallabin's Midwifery)లో 45-వ పుట:—

"గర్భవతి యగుటకును, బిడ్డనుగనుటకును యుక్తవయస్సువచ్చి నందుకుఁ జిహ్నముసామాన్యముగ మొదటిసారిఋతుమతియగుటయే."

(2) 'డబ్లియు—యస్—ప్లేఫేర్' Mr. W. S Playfair, M.D.,L.L D.,F.R.C P. అనువారువ్రాసిన 'సయన్స్-అన్డ్ప్రాక్టీస్ ఆఫ్ మిడ్వైఫరీ'— Science and practice of Midwifery అనఁగా సిద్ధాంతముతోడను బ్రత్యక్షానుభవములోడను గూడినమంత్రసాని శాస్త్రము) అనుగ్రంథమున నిట్లు వ్రాసియున్నారు. వీరు గొప్పగొప్పపరీక్ష లలోఁ గృతార్థులై, యం. డీ. యల్. యల్. డి. యఫ్.ఆర్.సీ.పీ.యను గొప్పగొప్ప బిరుదములను సంపాదించినవారై యున్నారు:—

"మొట్ట మొదటిసారి ఋతుమతియగుటయే రజస్వలయగుట. దానిచే నేర్పడు మార్పులు, స్త్రీకి గర్భవతి యగుటకును, బిడ్డను గనుట

కును యుక్తమగు ప్రాయము వచ్చెనని సూచించును—(72-వ-పుట

(3) పైగ్రంథముననే మొదటిసంపుటములో 338-వ పుట:—

"అంతేగాక, ప్రసవించు స్త్రీయొక్క-యీడు ముదిరినకొలఁదిని ప్రసవవేదన కూడ నెక్కు-వగు చుండునని సామాన్యముగఁ జెప్పుదురు. ఈడుముదిరినకొలఁదిని యవయవములుకూడ ముదురుట చేవానికి సహజముగ నుండవలసిన మృదుత్వము పోయి, యవి గట్టిబాఱును. అందుచే నీడుముదిరిన స్త్రీ ప్రసవింపవలసివచ్చినపుడు సామాన్యప్రసవవేదననుమించిన వేదన పడవలసి వచ్చుచున్నది" (338-వపుట)

పైగ్రంథముననే రెండవ సంపుటములోని 5-వపుటలో:—

"ఈడుముదిరినయీఁడుది మొదటిసారి ప్రసవించవలసివచ్చినపుడు ముఖ్యముగ మొదటితూరి గల్గుశ్రమముకంటె మిక్కి-లి యెక్కు-వగ విసుపును గల్గించును.................తఱచుగా నిట్టిశ్రమకు హేతువు శరీరమందలి బలహీనత యనుటకంటె, గర్భద్వారములు ముదిరి గట్టిబాఱి బిగుతెక్కి-యుండుటయే యని చెప్పవలసివచ్చుచున్నది.

(4) పైగ్రంథముననే మొదటి సంపుటమందలి 5-వ పుట:—

"గర్భకోశ సంబంధములగు కీళ్ళుకొన్ని యెముకవలె గట్టిబాఱును, కష్టపడుచుండు సమయమునఁ దెఱచుకొనవలసిన గర్భద్వారము తెఱచుకొనుట మానును; ఈవిధముగ మిక్కు-టమగుచిక్కు- వాటిల్లును. ఈడుముదిరిన స్త్రీలయొక్క- కానుపులందే యిట్టిచిక్కు- మిక్కి-లి తఱచుగాఁదటస్థించుచున్నది." ———(మొదటిసంపు.—5వపుట)

(6) మఱియును 'హ్యావ్ లక్-ఎల్లిస్' Havelock Ellis అనునతఁడును మఱికొందఱు పండితులునుజేరి యీశాస్త్రమునామూలాగ్రముగఁ బరిశోధించి తుట్టతుదకుఁదేల్చిన సిద్ధాంతమేమియనఁగా, "రజస్వలయైన పిమ్మట స్త్రీ తాను పురుష సంగమము చేసినచో దానివలన బిడ్డకుఁగాని తల్లికిఁగాని యెట్టిహానియును, గలుగఁజాలదు." 'ఇంగ్లండ్' దేశమునందుఁగూడ, గ్లాడ్ స్టన్ Gladstone అనునతని కాలమున "గర్భాధానవయోనిర్ణయశాసన" మేర్పఱచుటకుఁ బ్రియత్నముసాగినది. ఆయుద్యమము నుద్దేశించి పైఁజెప్పిన 'హ్యావ్ లక్-

ఎల్లిస్,' అను పండితుఁడు ఆఱవ సంపుట మందలి 11-వ యధ్యాయ ములోని 524, 525-వ పుటలలో నీదిగువరీతిగ వ్రాసియున్నాఁడు:—

"ఈవిధములగు శాసనములు వారివారి యిష్టానుసారముగ వారివారి బుద్ధికిఁదోచినరీతిగఁ గల్పింపఁ బడిన వనియును, ప్రకృతి విరుద్ధములని యును దెలిసికొన వలసియున్నది. దానికి జీవశాస్త్రసంబంధమగు నా ధారమేమియునులేదు. లోకజ్ఞానముగలవారు వాని నంగీకరింపరు. ఇతర విషయములకు సంబంధించిన ప్రపంచకజ్ఞానము గలిగి యుండుట కెంత యీాడనవసరమో యంతయీాడనువారీవిషయమై స్త్రీలకునిర్ణయిం చుచున్నారు. కాని, యుక్తమగు సంభోగార్హ ప్రాయము స్త్రీలకు వారు నిర్ణయించినప్రాయముకంటె జాలకాలను ముందుగనే వారివారి శరీర దార్ఢ్యమునుబట్టియు, బుద్ధిబలమునుబట్టియు నేర్పడు చున్నది. కావున పైన నిర్ణయించు ప్రాయమునకును, యుక్తమగు నసలుప్రాయమునకును నేమియుసంబంధము లేదు. అట్టియుక్తమగు ప్రాయ మొక శరీర సంబం ధమగు లక్షణముచేఁ దెలియవచ్చుచున్నది. అదియే రజస్వలయగుట. అదియే ఋతుకాలమునకుఁ బ్రారంభము. అదియే స్త్రీయొక్క-యవయ వములు పూర్ణముగాఁబరిపక్వమగుటను సూచించును. బాలిక రజస్వల యైనతోడనే బాలికాత్వమును విడచి స్త్రీత్వమును బొందుచున్నదని యును, భర్తతోచేరి సుఖించి బిడ్డలను గనుటకు యోగ్యురాలగుచు న్నదనియును, ప్రపంచమందలి యన్ని దేశముల జనులును స్వభావసిద్ధ ముగ నంగీకరించుచున్న విషయమే. ఇందలి ముఖ్యమగు నభిప్రాయ మేమనగా: రజస్వలకానట్టిభార్యతో గలసినభర్త నేరస్థుండగునేమో కాని, రజస్వలయైన భార్యతోగలిసినభర్త నేరస్థుడుకాఁజాలఁడు."—

(2) మఱియును పైగ్రంథముననే 636-వ పుటలో:—

"మిల్నర్ అనునతఁడు Milrer 14 ఏండ్లప్రాయమున గర్భ వతియైన యొక బాలికసమాచారమును గ్రంథస్థము చేసియున్నాఁడు. లాన్సెట్, జూన్ నెల 7 వ తేదీ, 1902 వ సం॥ము Lancet June 7 1902. ఆబాలికపడినప్రసవవేదనము కొద్దియేనఁట; మిక్కిలి సుఖము గాఁప్రసవించెనఁట; 'న్యూ-జెర్సీ' నివాసియగు 'ఈ.బీ మేల్స్' E. B. Males of New Jersey అనునతడు మఱియొక పిల్లయొక్క-సమాచా

రము వ్రాసిపెట్టెనఁట. ఆపిల్ల 11 ఏండ్ల ప్రాయముననే గర్భవతి యాయెనఁట; సామాన్యమగు పరిమాణమే గలదియఁట కాని యన్ని యవయవములును బూర్తిగా బరిణమించియున్నవఁట; పదియేండ్ల ప్రాయముననే రజోవతి యాయెనఁట; ప్రసవకాలమున మితిమీరినబాధ గాని, మూలుగులుగాని, యేడ్పులుగాని, పెడబొబ్బలుగాని, యెఱుఁగదట; చక్కని మొగబిడ్డపుట్టెనఁట; ఆబిడ్డను దూనికవేయఁగా 11 పౌనులకు-అనఁగా రమారమి మూఁడున్నరవీశెలకు దక్కువలేక తూగెనఁట, తల్లియును బిడ్డయును సుఖముగా నుండిరఁట; తల్లికి బాగుగనే పాలుస్రవించినవఁట. "కేప్ కాలనీ Cape Colony యను ప్రదేశమునకు "బ్రిటిష్" దేశమునుండి వలసవెళ్ళిన జాతిలోనియొక బాలికసమాచారమును 1902 వ సం॥ ము జనవరినెల, 18 వ తేదీన బ్రిటిష్ మెడికల్ జర్నల్ British Medical Journal, January ' 18-1902 అనుపత్రికలో "హ్వైట్‌సైడ్ రాబర్ట్సన్" White side Robertson అనునతఁడు వ్రాసిపెట్టెను. ఆబాలిక 13-వ యేటనే గర్భవతియాయెనఁట; ఎట్టిశ్రమముగాని యపాయముగాని లేకయే మిక్కిలి సుఖముగాఁ బ్రసవించెనఁట. బిడ్డ పూర్ణమగు నన్ని యవయవములతో నలరారుచుండెనఁట.

636-వ పుట.

ఈ పైఁజూపిన గొప్పవిద్వాంసు లందఱియొక్క యభిప్రాయములుగూడ హిందువులయొక్క శాస్త్రాచార పద్ధతులను నేకగ్రీవముగ బలపఱచుచున్నవి. వాని ననుసరించి, బాలిక రజస్వలయైనప్పటి నుండియు భర్తతోఁజేరి సంసారసుఖ మనుభవించుటకు యోగ్యురాలగుచున్నది. లేనిపోని శాసనములను గొనితెచ్చిపెట్టి యట్టిసుఖమునకు భంగము గలిగింపఁజూచుట పాపహేతువు. బాలికయొక్క గర్భకోశము మొదలగు నవయవములు పూర్తిగఁబరిణమించి వానివాని పనులను జేయ సమర్థములై యున్నవనియును, నందుచే బాలిక గర్భవతియై బిడ్డను గనుటకుఁ దగియున్నదనియును స్వభావసిద్ధముగఁ దెలియఁజేయు చిహ్నమే బాలికయొక్క ప్రథమరజోదర్శనము.

8. హ్యావ్ లక్ ఎల్లిస్ Havelock Ellis అనునతఁడుచెప్పియున్న యీక్రింది విషయమును బైరిఫార్మరులు గమనించుటమంచిది:—

"బాల్యవివాహములే లేనిపక్షమున స్త్రీపురుషులు నిజముగా నీతికి గట్టుపడి నడచుటయే సున్నయని కొంచెమాలోచించినచోఁ బ్రతివానికిని దెలియవచ్చును; ప్రకృతిసిద్ధమగు రతిసౌఖ్యము ననుభవింపనీయక, యీడువచ్చిన స్త్రీపురుషులను శాసనమూలముగ నిర్బంధింపఁ బూనుట యిదివఱలోఁ జెప్పినరీతిగ నట్టి స్త్రీపురుషులయెడను, దేశముయొక్క-జాతియెడలను నపరాధమును గావించుటయేగాని వేఱుగాదు. అట్టినేరముచేఁ బ్రకృతిసిద్ధమగునభిలాషనునాశనముచేసినవారగుదురు.

ఈహేతువుచేతనే హిందూమత శాస్త్రకర్తలగు మహర్షులందఱునుగూడ బాలికలకు రజస్వలలు కాకపూర్వమే వివాహములను, రజస్వలలైన వెంటనే గర్భాధానమును నిర్ణయించి విధించియున్నారు.

9. సుప్రసిద్ధులగు దేశాభిమానులలోను సంస్కర్తలలోను నొకరై ఖ్యాతివలఁ గీర్తిశేషులైన శ్రీలాలా లజపతిరాయిగారు తాముప్రాసిన, అన్హ్యాపీ ఇండియా Late Mr Lala Lajpat Rai's Unhappy India పుస్తకములో 214 పుటయం దిట్లు వ్రాసియున్నారు:—

"స్త్రీతనవివాహమునకుముందే పురుషసంయోగ మనుభవించు నాచారముగాని, పిమ్మటఁ బెక్కుమంది పురుషులసంయోగ మనుభవించు నాచారముగాని, యితరదేశములందుకంటె, ఇండియాదేశములో మిక్కిలి యరుదు. పాశ్చాత్యదేశములం దతిబాల్యవివాహములు లేకపోవచ్చును; గాని యంతమాత్రముచే నతిబాల్యమున స్త్రీపురుష సంయోగములు లేవని తలంపరాదు. ఇండియాలో బాల్యవివాహమనఁగా బాల్యముననే సంయోగము గలుగఁజేయుటయని యర్థము కాదు. అంతేగాక స్త్రీ తనపురుషుని జేరుటకుముం దితరపురుషుల సంయోగమును జేయకుండ వారించుటలోఁగూడఁ బై బాల్యవివాహములుఁ దోడ్పడుచున్నవి. పాశ్చాత్యదేశములందట్లుగాక, ధర్మమైనను నధర్మమైనను వివాహమునకుపూర్వమే సంయోగముచేయుట యుచితమని తలంచువారుకూడఁ గొందఱున్నారు. ఇట్టియాచార మింగ్లండుదేశమం దించుమించుగఁ బల్లెటూళ్లయం దంతటను, సామాన్యమై యున్నదని "హ్యావ్లక్ ఎల్లిస్" Havelock Ellis అను గ్రంథకారుఁడు వ్రాసియున్నాఁడు. మరియు నతఁడే యింక నేమిప్రాసెననఁగా:-

మఱికొన్ని దేశములందు స్త్రీలకు వివాహము కాకపూర్వమే పురుష సంభోగసౌఖ్య మనుభవించుట సర్వసామాన్యమైన యాచారముగ నలరారుచున్నదఁట. అట్టి స్త్రీలు కొందఱు తాము మొదట మచ్చు జూచిన పురుషునే పిదప పెండ్లియగుదురఁట. మఱికొందఱట్లుఁగాక తమకుఁ దగినవరుని నిర్ణయించుకొనుటకుగాను మచ్చుజూచుటకై యనేకపురుషులతో సంగమము చేయుదురఁట..................ఆరీతిగనే 'స్ట్రాఫ్ఫర్డ్‌షైర్' Strafford-Shire ప్రదేశమందలి కొన్ని భాగములలో స్త్రీ వివాహమాడుటకుముందే యొకబిడ్డను గనియుండుటఁగూడ నాచారమంట. స్వీడన్ Sweeden దేశములో నెక్కువ వివాహము లీతీరుగనే జరుగునని ఎల్లెన్. కీ. Ellen Key అనునతఁడు వ్రాసెనని పైఁజెప్పిన " ఎల్లిస్ " పండితుఁడు వ్రాయుచున్నాఁడు. వివాహము నకుపూర్వ మెంతస్వాతంత్ర్య మనుభవింపఁబడుచున్నదో వివాహానంతరము పాటింపవలసిన పాతివ్రత్యనియమమునందుగూడ నంతటిస్వాతంత్ర్యమే యనుభవింపబడుచుండుటచే నీయేర్పాటు చాలా యనుకూలమని తలంపఁబడుచున్నదఁట. డెన్‌మార్క్‌లో Denmark కూడ ననేకమందిబిడ్డలు తల్లిదండ్రులకువివాహములుజరుగకపూర్వమే పుట్టినవారు గలరు " 214 వ పుట.

10. పైపుస్తకముననే 21 వపుటలో 'హావ్‌లక్-ఎల్లిస్' Haveleck Ellis పండితుఁడు వ్రాసియుంచిన యొకసమాచారము తూర్పు జర్మనీ దేశమునకు సంబంధించినది యిట్లు వర్ణింపఁబడియున్నది:—

"పురుషసంయోగమందలి యభిరుచియిట్టిదగుటచేత నేపదునాలుగేండ్లు దాఁటినస్త్రీలలో సంయోగసౌఖ్యమనుభవింపని దొక్కతెయు నుండఁ జాలదని యనేకులు నమ్మియున్నారు. అందాశ్చర్యమేమియును లేదు.

11. పైపుస్తకముననే 216 వ-పుటలో నిట్లు వ్రాసియున్నారు:—

"మనము తప్పక జ్ఞాపకముంచుకొనఁదగిన విషయమేమనఁగా ఇండియాలో బాలికలకు వివాహమైన పిమ్మటఁజాలాకాలమునకుఁ బురుషసంయోగము గల్గుచుండఁగాఁ బాశ్చాత్యదేశములలోవివాహమునకుఁ జాలాకాలము ముందుగనే యట్టిసంయోగము లభ్యపడుచున్నది. ఇండియాలోని బాల్యవివాహముల నాక్షేపించు పెద్దమనుష్యు లీవిషయమును మఱువకుందురుగాక ! 216-వపుట.

12. అమెరికాలో ' జూవెనైల్-కోర్టులో Juvenile Court అనఁగాఁ బిల్లవాండ్రుచేసిన నేరములను విచారించెడి ప్రత్యేకన్యాయ స్థానములో 25 సంవత్సరములు జడ్జిపనిచేసిన ' బెన్-లిండ్సే ' గారి Judge, Ben Lindsey యనుభవవిషయముగూడఁ బైపుస్తకమున 217-వ పుటలో నీక్రిందిరీతిని వర్ణింపఁబడియున్నది:—

'లిండ్సే-యను జడ్జీ విచారించిన నేరములలో నెక్కువభాగము హైస్కూలులోఁ జదువుబాలురకును బాలికలకును సంబంధించియున్నది. వీరిలో నించుమించుగ నందఱును గొప్పఖ్యాతిగల ధనవంతులకుటుంబములకుఁ జెందినవారైయున్నారు. ఇట్టిబాలికలలోఁ బైజడ్జిచే విచారింపఁబడిన వారనేకులు పురుషసంగమమును గుఱించి తెలిసికొనఁదగిన యీడురాక పూర్వమే యట్టి సంగమసౌఖ్యానుభవ మభిలషించుచుఁ గామోద్రేకపరవశు లగుచున్నారు. వారివిషయమై యాజడ్జీయిట్లు చెప్పుచున్నాఁడు:— హైస్కూలులోఁ జదువు బాలురును బాలికలును జేరి టీ పార్టీలు (Tea Parties) మొదలగువానికిఁ బోవుచుందురు:— అచ్చటి నాట్యములలో (Dances) పాల్గొను చుందురు; మోటారుబండ్లలో నెక్కి-షికారు పోవుచుందురు. ఇట్టివారిలో నూటికిఁ దొంబది (90)మంది యాలింగన సౌఖ్యమునకును (అనఁగా, కౌఁగలించుకొనుటకును) చుంబన సౌఖ్యమునకును (అనఁగా, ముద్దుపెట్టుకొనుటకును) రుచి మఱిగియున్నారు.........కొందఱు బాలికలు తమవెంటవచ్చు బాలురిట్లు చేయగోరి, తీవ్రముగనట్టి సౌఖ్య మభిలషించుచు నందులకు వలసిన సరస సల్లాపముల నాతురతతో సాగించుచుందురు. అట్టి యాతురతతో బాలురు సహితము బాలికలకుఁ దీసిపోరు. (అనఁగా నిరువురును సమానముగ నేయాతురతఁజెందుచుందురు") కాని ఆలింగనమును, చుంబనమును మైథునకర్మకు నారంభమందలి యంగములేగాని పర్యవసానాంగములు గావుగదా! అట్టి యంగములతో నారంభించిన వారిలోఁ గనీసము నూటికి 50 మందియైనను నితరాంగములతోఁ గూడఁజేర్చి మైథున సౌఖ్యమును దుదముట్టఁ ననుభవించియుందురేకాని, యంతటితోనిలువరు. ఇట్టిచర్య లనుచిత

మనుమాట యన్ని సంఘములవారును గొంతెత్తి యాందోళనము చే
యుచున్న విషయమేగదా! ” (అన్‌హ్యాపీ-ఇండియా 217-వ పుట)

పైవిధములగు మర్యాద లన్నియును మన సంఘమున లేనిలోప
మును దీర్చకోరియేగదా, యిప్పటి రిఫార్మరులు మనదేశమందలి
బాల్యవివాహమును, రజస్వలానంతర గర్భాధానములను నిలిపివేయఁ
గోరి శాసనములు గావింపఁ జూచుచున్నారు! వీరి కోరికప్రకారము
పై శాసనములే సాగనిండు; పైవిధమగు దురాచారములు మనదేశమునఁ
గూడ విజృంభించి దేశమును ధ్వంసముఁ గావింపకున్న నపుడు చూత
ము. బాల్యవివాహములులేని యితర దేశములందుఁ బొడముచున్న
యిట్టి కుళ్లు నంతను దెలిసికొనజాలక, కన్నులు మూసికొని “ సంఘ
సంస్కరణము, సంఘసంస్కరణము” అని పలవరించక దీర్ఘాలోచనము
చేయుఁడు. మీరుచేయునది పరకీయదురాచారానుసరణముగాని సంఘ
సంస్కరణ మెంతమాత్రమును గాఁజాలదు. దీనివలన పరదేశమునందు ప్ర
బలుచున్న దురాచారములే మన సంఘమునందుకూడ కలుగఁ గలవని
లోకానుభవజ్ఞులగు పూర్వాచారపరాయణులగు విమర్శకులు చెప్పగా
వారిని పరిహసించుచు 'వారి యభిప్రాయములను తమ పత్రికలందు
ప్రకటింపకయు, శాస్త్రమర్యాదను భారతీయస్త్రీ సంఘమర్యాదను
చిన్ననాఁడే వదలి స్వేచ్ఛాచారపరాయణలయిన స్త్రీల లజ్జావిహీనచే
ష్టలను స్త్రీస్వాతంత్ర్యమనియు, వ్రాతలను అభిప్రాయములను భార
తీయ స్త్రీలందఱియొక్క అభిప్రాయమని సాహసముతో వ్రాయునట్టి
యు, ప్రకటించునట్టియు కొందఱు పత్రికాధిపతులయొక్క విపరీత
ప్రవర్తనమును మేము ఏవగించుచున్నారము.

3-వ హేతువు:—(అనఁగా, బాలికల యవయవములు పరిపూ
ర్ణాభివృద్ధిని జెందకపూర్వమే గర్భములు గల్గుచుండుటచేఁ బుట్టిన పసి
బిడ్డ లనేకమంది చనిపోవుచున్నారను హేతువు.)

సమాధానము:— ఈ హేతువు సరియైనది కాదు. ఇట్టి తప్పుడు
హేతువును జెప్పి రిఫార్మరులు జనులను మోసగించుచున్నారు. ఏల
యనఁగా; బాల్యవివాహములున్న సంఘములందుఁగాని దేశములందుఁ
గాని, పసిబిడ్డల మరణము లెక్కువగానున్నవనుటకుఁ దగిననిదర్శనము

లెనె లేదు. బంగాల ,ఒరిస్సా,పరగణాలలో 1911 సం॥రపు జనాభా లెక్కలను బరిశీలింపఁగా బాల్యవివాహములకును, బసిబిడ్డల మరణములకును నేమియును సంబంధము లేదని ఋజువగుచున్నది. కొన్ని జిల్లాలలో జరుగు వివాహములలో 1000 కిని, బాల్యవివాహములు (అనగా 10 యేండ్లు మొదలు 15 ఏండ్లలోపలి యాఁడుపిల్లలకు జరుగుపెండ్లిండ్లు) లెక్కింపఁగా, 180 మొదలుకొని 565 వఱకునుగలవు. అట్టిజిల్లాలలోనే శిశుమరణముల సంఖ్య మిక్కిలి తక్కువగా నున్నమాట నిర్వివాదాంశమని, బాబూ-చారు చంద్రమిత్ర (Babu Charu Chandra Mitra )యను నతఁడు చూపియున్నాఁడు. బాల్యవివాహములు చేయుదేశములో నగ్రగణ్యమైన దర్భాంగసంస్థానమందు జరుగు వివాహములలో 1000 కిని 565 బాల్యవివాహములుగా నున్నవి. ఆదేశమందలి శిశుమరణ సంఖ్య నూటికిని 13 మొదలు 16 వఱకును నున్నది. 'డార్జిలింగు నందును పూరీయందును 1000 కిని 17 మొదలు 20 వఱకు మాత్రమే బాల్యవివాహములు జరుగుచున్నవి. కాని యాదేశమందలి శిశుమరణ సంఖ్య నూటికి 21 మొదలు 22 వఱకును, 22 మొదలు 24 వఱకును గలదు. ఇఁక 'బర్మా' యందు బాల్యవివాహములు లేవనియే చెప్పవచ్చును. ఏలయన 1000 కిని, 4 మాత్రమే యట్టివివాహములు జరుగుచున్నవి. ఆదేశమందలి శిశుమరణసంఖ్య, బెంగాల్, బీహార్, ఒరిస్సా లను మూఁడు దేశములందలి సంఖ్య కంటె నెక్కువగా నున్నది. ఈమూఁడు దేశములును బాల్యవివాహములలోఁ దక్కిన దేశములకంటే ముందంగ వేయుచున్నవి. 'అప్పర్-బర్మా" దేశమున శిశుమరణసంఖ్య 1000 కిని మగశిశువులు 215; ఆఁడు శిశువులు 192 'లోయర్ బర్మాలో మగశిశువులు 244 ఆఁడు శిశువులు 221 చైనాదేశము (China) నందు, శిశుమరణ సంఖ్య 315; రష్యా (Russia) లో 245; హంగేరీ (Hungary) 204; ఇండియాలో మగశిశు మరణములు 211 ఆఁడు శిశుమరణములు 199 రెండును జేర్పగా, సరుటున (average) 205 మాత్రమే యగుచున్నది.

(Rationale of Early Marriage System) అనఁగా, "బాల్యవివాహపద్ధతియొక్క సత్యసారము' అనుగ్రంథములో శ్రీయుత,

యు-పీ- కృష్ణమాచార్య (Mr. U. P. Krishnama Charya) అను వారిట్లు వ్రాయుచున్నారు:—

"మదరాసు పట్టణముమాటయే యాలోచింతము. 1926-27 సంవత్సరముల జననమరణాలలెక్కలను, కార్పొరేషన్ వారు తయారు చేసి ప్రకటించియున్నారు. వానినిబట్టి చూడఁగా నెక్కువ బాల్యవివాహము లేచేయు బ్రాహ్మణసంఘమందే, తక్కిన యన్నిసంఘములందుకంటె శిశుమరణసంఖ్య తక్కువగా నున్నదని స్పష్టమగుచున్నది.

వీని నన్నిఁటినిఁబట్టిచూడఁగా, రిఫార్మరులు చేయు పైవాదము నిరాధారమనియు వట్టి దుర్వాదముచే జనులను మోసగించుచున్నారనియును విశదమగుచున్నది. ఇంగ్లండు, ఫ్రాన్సు మొదలగు దేశములందు శిశుమరణసంఖ్య 1000 కిని, 100 మొదలు 152 వఱకు నుండును. అందుచే నాదేశము లందుకంటె నిండియాలో నట్టి మరణసంఖ్య యెక్కువయైనమాట వాస్తవమే కావచ్చును. కాని యందులకు హేతువులు దారిద్ర్యమును, వ్యాధులును, పాలును నాహారపదార్థములు మొదలగునవి కొఱతపడుటయును, నివాసప్రదేశము లపరిశుభ్రముగు స్థలములుగా నుండుటయును, నారోగ్యశాస్త్రసంబంధమగు పద్ధతులు జను లెఱిఁగియుండక పోవుటయును మొదలగు కారణములనేకములుండవచ్చును. మనదేశపు దారిద్ర్యవిషయమై యీక్రింది విషయమును బరిశీలించిన దెలియును. 1924 సం॥ రమున, ఇండియాదేశమందలి యాదాయము సకుటున నొక్కొక్క మనుష్యునకు 30 రూపాయీలని లెక్క తేలినది. అదియే యింగ్లండుదేశమున మనుష్యున కొకనికి 586 రూపాయీలవంతునను, అమెరికాలో 600 రూపాయీలవంతునను, లెక్క తేలుచున్నది. ఆసంవత్సరమున ఇంగ్లండ్ దేశమున విద్యాభివృద్ధికై వెచ్చింపఁబడిన ద్రవ్యము మనుష్యున కొకనికి రూ. 4-12-6 పై॥వంతున లెక్క తేలుచున్నది; అమెరికాలో రూ. 12-0-0 వంతునఁ దేలుచున్నది. ఇఁక ఇండియాలో నెంత తేలుచున్నదో తెలియునా? ఒక్కొకమనుష్యునకు రూ. 0-1-0 పై. (అక్షరాల ఒక అణా) వంతున తేలుచున్నది. అమెరికాలోఁ జదువునేర్చినవారు నూటికి 99 మందికిఁ బైగాఁగలరు; ఇంగ్లండులో 100 కి 99 వంతునగలరు; జపానులో

నూటికి 95 వంతునఁగలరు. ఇఁక, ఇండియాలో బెంగాలులో ఎందఱు గలరో తెలియునా? నూటికి 7 మందికి పైగాగలరు. ఇట్టిపరిస్థితులలో ఇండియాలో మరణసంఖ్య యితరదేశములంకుకంటె నెక్కువగనున్నం దుల కాశ్చర్యపడవలెనా? ఇండియాలో మరణసంఖ్య 1000కిని, 34 కు పైగా నున్నది. ఇంగ్లండునకు జపానులోను నూటికి 11కు పైగాను, 20 పైగాను నున్నది. ఇండియాదేశపు పైపరిస్థితుల నితరదేశపుపరిస్థి తులతోఁ బోల్చిచూచితిమేని మరణసంఖ్యయం దింత కొద్దివ్యత్యాస మున్నందుకు సంతసింపవలెఁగాని యబ్బురపడవలెనా!

4-వ హేతువు:—(అనఁగా బాల్యవివాహముచేఁ దల్లులును బిడ్డలును దుర్బలశరీరములు గలవా రగుచున్నారను విషయము,)

సమాధానము:—విచారింపగాఁ బైదానివలె నిదియును సరి యైనహేతువుకాదు.జనాభా లెక్కలరిపోర్టులో 303-వ పుటలో ఒమల్లి (Mr O'Mally) యనువారిక్రిందిరీతిగ రిమార్కు వ్రాసియున్నారు. బాల్యవివాహములను నిల్పివేయువలయు నను నుద్యమముతో పేరును బాల్గొనియున్నవారే సుమీ:—

"బాల్యవివాహములు విరివిగా వ్యాపించియున్నను, బీహారు దేశమందు దాఁకువారి మరణసంఖ్యను మగవారిమరణసంఖ్యతోఁ బోల్చి చూడఁగా, నూటికి 89 తేలుచున్నది; బెంగాలులో 91 కిఁ గొంచెము పైగాఁ దేలుచున్నది. కాని, యూరపునందు 90 కిఁ గొంచెము పైగా దేలుచున్నది. దీనినిబట్టి బాల్యవివాహములు చేయు దేశమునకును, జేయనిదేశమునకును, నెక్కువవ్యత్యాసమేగనుపట్టుటలేదని భావము...

హిందూస్త్రీలు జీవించు విధానము తక్కిన యితరమతములం దన్నిఁటియందును బురుషులు జీవించువిధానముకంటె బాగుగానున్నది.

1928-వ సంవత్సరపు జనాభారిపోర్టు 233-వ పుటలో నిట్లువ్రా యఁబడియున్నది:—మహమ్మదీయస్త్రీలకంటె హిందూస్త్రీలే యొ క్కువకాలము జీవించుచున్నట్లు గనుపట్టుచున్నది. 10 సం॥రములు మొదలు 15 సం॥రముల యీడులోపలఁ బెండ్లియగువారు, హిందూ స్త్రీలసంఖ్యలో ముప్పాతికభాగము మాత్రమే మహమ్మదీయ స్త్రీల లోఁగలరు. బాల్యవివాహములు సృష్ట్యాదినుండియు వచ్చుచున్న యా

నాద్యాచారమని తెలిసికొనఁదగియున్నది. ధర్మశాస్త్రకర్తలలో నందఱికంటెను, బుఁరాతనుఁడైన మనువు స్త్రీలకు 8 మొదలు 12 సం॥ రముల యీడులోపలనే వివాహములను విధించియున్నాఁడు. కాని పూర్వకాలమందలి జనులలో హిందువు లందఱికంటెను నన్నివిధముల ముందంగవేయువారుగ నుండిరేగాని యేవిషయమునను నొకరికిఁదీసిపోయి యెఱుఁగరు. మహమ్మదీయప్రభుత్వము ప్రారంభము కాకముందుకు హిందువులు దీర్ఘకాలము జీవించుచుండిరి. అదిమొదలు వారి యాయువు క్రమముగాఁ దగ్గిపోవ నారంభించెను.

మౌలానా-మియుడ్—హాజుడ్డీన్ (Maulana Miud Hazuddin) అనువా రిట్లుచెప్పియున్నారు:--"హిందువులయొక్కయు, మహమ్మదీయులయొక్కయు, జరిత్రలను బరిశీలింపఁగా, సకుటున (average) హిందువులయొక్క జీవితకాలమే మహమ్మదీయులయొక్క జీవితకాలముకంటె నెక్కువగనున్నది. శీతోష్ణపరిస్థితు లిరువురి విషయమునఁగూడ సరిసమానముగనే యున్నప్పటికిని, సకుటున హిందువుఁడు 102 సం॥ రములవఱకును జీవించుచున్నాఁడు. మహమ్మదీయుఁడు 76 సం॥ లు మాత్రమే జీవించుచున్నాఁడు."

అబ్దూలు-ఫజాల్ (Abdul Fazal) అను సుప్రసిద్ధచరిత్రకారుఁడు, క్రిందిరీతిగఁ జెప్పుచున్నాఁడు:—హిందువులు మహమ్మదీయులకంటె దీర్ఘకాలము జీవించుటమాత్రమేగాక, వారిలో మరణసంఖ్య సామాన్యముగ మహమ్మదీయులందుకంటె మిక్కిలి తక్కువగనున్నది. హిందువులు సకుటున 90 యేండ్లవఱకును బ్రతుకుచున్నారు. మహమ్మదీయులట్లుగాక 78 సం॥ ములు మాత్రమే బ్రతుకుచున్నారు."

దీనివలన బాల్యవివాహములుగల హిందువులందే యాయురారోగ్యములు తక్కినజనసంఘములందుకంటె నెక్కువగ నున్నవనిబుజువగుటలేదా!

5-వ హేతువు:—(దేశమందలిజాతి బలవంతులును, నారోగ్యవంతులును నగుటకు బాల్యవివాహములు భంగకరములనువిషయము.)

సమా:—తమకిష్టము లేకపోవుటచే బాల్యవివాహములను తుద

ముట్టింపఁ గోరురిఫార్మరుల కిది యింకొకనెపమేగాని యంతకంటె వేఱేమియును లేదు.

లాలా లజపతిరాయిగారీవిషయమై 'అన్ హ్యాపీ-ఇండియాలో' నీక్రింది రీతిగ వ్రాయించియున్నారు. Lala Lajpat Rai's Unhappy India

"ఆదికాలము నుండియు బాల్యవివాహము లేయాచారముగనల రారుచున్న ప్రజాసంఘములనుండియే పేరుమ్రోగిన నాగరికజాతు లుద్భవించియున్నవి. గ్రీకువారు (Greeks) బాల్యవివాహములనే యాచరించియుండిరి. యోధాగ్రేసరులై యనేకదేశముల నాక్రమించిన రోమనుజాతివారు (Romans) బాల్యవివాహములను గావించుకొన్న వారే. హీబ్రూజాతియునట్లుచేసినదే. ఇంగ్లండులోనూ స్టూవర్ట్స్ కాలమువరకును (Stuarts) బాల్యవివాహములే సామాన్యముగ నాచారమై యుండెను."

"బాల్యవివాహములు జాతికి నరిష్టదాయకములే యైయున్న చో గ్రీకులును, రోమనులును హీబ్రూలును, దేశచరిత్రయందంతటి ప్రఖ్యాతినొందుట కవకాశమే లేకుండెడిది."

అంతేగాక, బాల్యవివాహములు చేయక యాలస్యముగా, వివాహములుచేయుటచేత సుఖవ్యాధులెక్కువగ వ్యాపించుటకు హేతు వగుచున్నదని యెఱుంగవలయును. ఈవిషయమై హ్యావలక్ - ఎల్లిస్ పండితుఁ డిట్లు వ్రాయుచున్నాఁడు:—

"న్యూయార్కుపట్టణమున (New York Havelock Ellis) ప్రతిసంవత్సరమునను గనీసము 2 లక్షల 50 వేలమంది ప్రజలు సుఖవ్యాధులచేఁ బీడింపఁబడు చుండిరనియు, నాపట్టణమందలి గొప్పకుటుంబములలోఁ బుట్టినవారిలోఁగూడ గనీసము మూఁడవ పాలు మగపిల్లవాండ్రు' సిఫిలిస్ (Syphilis) అనగా సవాయి అను వ్యాధిచేత బాధపడుచుండుటను స్వయముగా నెఱుఁగుదు నని యానగరమందలి యొక వైద్యశాస్త్రజ్ఞుఁడు చెప్పెననియు, దెలిసి యా విషయమును విచారించుటకై యొక వైద్యసంఘ మేర్పాటుచేయఁబడి నది. జర్మనీదేశమునఁ బ్రతివత్సరమును సుఖవ్యాధులచే బీడింపఁబడు

హా రేనిమిదిలక్షలు గల రని యధికారులు లెక్కించిరి. గొప్ప విశ్వ విద్యాలయములో (Universities) విద్యార్థులందు సుఖవ్యాధులు సర్వసామాన్యము. వారిలో నూటికి 25 వంతున నట్టివ్యాధులచేఁ బీడింపఁబడుచుందురు. జర్మనీదేశపుసైనికులలోని సుఖవ్యాధిపీడితుల సంఖ్య ఫ్రాంకో-ప్రసియన్ యుద్ధమున (Franco-Prussian War) గాయములు తగిలిన సైనికులసంఖ్యలో మూఁడవవంతుండును. ఐనప్పటికిని బ్రిటిషుసైనికులతోఁ బోల్చి చూచిన జర్మనీసైనికులే నయమనిపించు కొందరు. బ్రిటిషుసైనికులందున్నంతమంది సుఖవ్యాధిపీడితులుయూరపు నందలి యేయితరసైన్యమునందును లేరు. ఇండియాలోని సైనికుల మాట చూచిననుగూడ బ్రిటిషుసైనికులందున్న సుఖవ్యాధిపీడితులసంఖ్య ఇండియన్ సిపాయిలందున్నసంఖ్యకంటె పదిరెట్లెక్కువగనున్నది."

'గనేరియా (Gonorrhea) రోగమువిషయమై ఎల్లిస్ పండితుఁ డిట్లు వ్రాయుచున్నాడు:—"అమెరికాలో నీడువచ్చిన మగపిల్లవాండ్రలో గనేరియాచేఁ బీడింపఁబడువారు నూటికి 65 మొదలు 30 వఱకును గలరని 'ఉడ్-రగల్స్' (Wood Rugles) అనునతఁడు లెక్క వ్రాసియున్నాఁడు. ఇంగ్లండులో నీడువచ్చిన మగపిల్లవాండ్రు గనేరియాచేఁ బీడింపఁబడువారు నూటికి 75 వంతున నొకతూరియు, 40 వంతున నొకతూరియు, 15 వంతున మఱియొకతూరియు నుండిరి.

దీనిని బట్టి యింగ్లండు, అమెరికా మొదలగు దేశములందు బాల్యవివాహములు లేక ఆలస్య వివాహములు మాత్రమే యుండుటచే అట్టిదేశములందు ఇట్టి దురవస్థలన్నియు గలుగగలవను విషయమును దృష్టిలోనుంచుకొనియే సర్వజ్ఞులగు మన్వాది మహర్షులెల్లరును ధర్మశాస్త్రములందు బాల్యవివాహములనే యేకగ్రీవముగ విధించి యుండిరి. వానిని ద్రోసి రాజనినచో, మనదేశమునకుఁ గలుగబోవు ఫలము కూడఁ బైవిధముగనే యుండును. జాగ్రత్త. జాగ్రత్త.

కనుపర్తి మార్కండేయశర్మ.



# శ్రీ. పం. మదన మోహన మాలవ్యాగారి
# శాస్త్ర విశ్వాస పరిణామము.

గతసంవత్సరము ప్రియాగలో కుంభమేళ సమయమునందు శ్రీమాలవ్యాగారు సనాతనధర్మసభను సమకూర్పగా, అందు సభ్యు లగు పండితులు స్త్రీ, శూద్ర, అంత్యజాతులకు ప్రణవసహిత మంత్రోపదేశము అశాస్త్రీయమని నిర్ణయించి యుండిరి. మొన్న కాశీలో జరిగిన అఖిలభారతవర్షీయ బ్రాహ్మణసమ్మేళనమునందుకూడా అట్లేనిర్ణయించిరి. అంతటిలో తృప్తినొందక, శ్రీమాలవ్యాగారు, శ్రీగోవర్ధన మరజగద్గురువులవారి యాధిపత్యముతో అఖిలభారతవర్షీయసనాతన ధర్మసభయను పేరుతో కాశీనగరమున హిందూస్కూలులో బ్రాహ్మణ సభ జరిగిన మరునాటినుంచి మూడుదినములు సభ జేయఁగా ఆసభలో గూడా పైవారికి ప్రణవసహితమంత్రగ్రహణాధికారము లేదనియు, ప్రణవరహితముగ గలదనియు తీర్మానింపఁబడెను. శ్రీమాలవ్యాగారందుకు సమ్మతింపక కొందరు పండితులను కమిటీగానియమించి ఐదుమాసములలోపల శాస్త్రసమ్మతముగా ఈవిషయమును నిర్ణయించకోరిరి. ఇప్పుడు తాను ఏర్పఱచిన కమిటీనికూడా తిరస్కరించి ఈవిభవసం॥మార్గశిర,శుక్ల పాడ్యమిమొదలు పంచమివరకు శ్రీకాశీ క్షేత్రమున దశాశ్వమేధ ఘట్టమునందు రుద్రస్వాహాకారయాగము చేసి మరునాఁడు షష్ఠి మంగళవారము నాఁడు, చండాలురకు ప్రణవ పూర్వక, పంచాక్షరి, అష్టాక్షరి మంత్రములను శిరస్సుమీద చేయియుంచి శ్రీమాలవ్యాగారు ఉపదేశించిరి. 100 గురు అంత్యజ బాలకులు, 300: గురు ఇతరులును ఉపదేశము నొందిరి. అర్థాసక్తిగల దరిద్ర విద్యార్థులు మాత్రము కొందరు ఋత్త్విక్కులుగా పోయి యుండిరి. మరునాఁడు మార్గశిర, శుక్లసప్తమి, బుధవారము (19-12-28) కూచిబిహార్ రాజాగారితోటలో శ్రీద్వారక జగద్గురు పీఠాధిపతి

గారి సభాధిపత్యముతో సనాతనధర్మ పరాయణులగు కాశీపండితులు సభచేసి యందు మహామహోపాధ్యాయ, తర్కరత్న పంచానన, వామాచరణ భట్టాచార్య, రామభవన్ పండిట్ మున్నగుపండిత శ్రేష్ఠులును, భారతధర్మ మహామండల ప్రవర్తకులగు శ్రీ దయానంద స్వామిమున్నగువారలును, శ్రీమాలవ్యాగారుచేసినది అశాస్త్రీయ మనియు, దుష్కార్యమనియు గర్హించిరి. ఇంగ్లీషుచదువుకొన్న బ్రాహ్మణులందఱు శ్రీమాలవ్యాగారికి గలశాస్త్రవిశ్వాసనటనమును ఇప్పుడైనా గ్రహించి జాగరూకులై యుందురుగాక! ప్రారబ్ధవశమున సంభవించిన బ్రాహ్మణ, బ్రాహ్మణేతర ద్వేషము దేశమునకు చాలదని బ్రాహ్మణులకు, చండాలురకుకూడ ద్వేషమును కలుగజేయు మార్గమును శాస్త్రవిశ్వాసముగల సనాతన ధర్మపరాయణుడనని చెప్పుకొనుచున్న శ్రీమాలవ్యాగారు చేయుట దేశదురదృష్టముకాదా!

వేదుల్ల సూర్యనారాయణ శాస్త్రి
కాశీ క్షేత్రము; క్షేమేశ్వరఘట్టము.



# నేఁటికాలపుఁ గవిత్వము

( గతసంచిక తరువాయి )

నన్నయ్య మొదలగు పూర్వకవుల కవితాకన్య యతిప్రాస లను సువస్త్రాభరణాదుల ధరించి సర్వాంగసుందరియై యొప్పుచున్నందులకు నిందించుచు విగతవస్త్రనుగా నొనరించి కురూపగాఁజేయుటకుఁ బ్రయత్నించుచుండ బిరుదాంకితులగు నేఁటికాలపు సుకవీశ్వరు లంద ఱెటుల సహించి యూరకున్నవారలో! తగుసమాధానముఁ జెప్ప లేకనో? పైనిందకు సమ్మతించియో? అసమర్థులయియో!

భాషాభిమానులారా !

భాష పాడైపోవుచు నిర్జీవప్రతిమరూపు దాల్చుటకు సిద్ధముగు చుండ మీరెటుల సహించి యుండఁగలరు ? మీనిద్రనుండి మేలు కొనుఁడు. జీవములుపోవ సిద్ధముగనున్న మన యాంధ్రభాష నుద్ధరింపుఁడు. పూర్వకవులను బూజింపుఁడు ? వారలమార్గమునే ద్రొక్కుఁడు.

విద్యాశేఖరులవారు కవితలో యతిప్రాసనియమము లుండరాదనియు నిటుల నియమములు పాటించి గ్రంథమంతయు వ్యర్థపదములతో నించి నన్నయాదులు భారతమును శవాకృతిగాఁ జేసిరనియు నుడువుచున్నారు. మఱియు దానిలోఁ దమ పిచ్చిప్రసంగములఁ జేర్చినారఁట. ఆహా! వీరిపాండిత్యమునకు వీరి కీతలంపు పుట్టవచ్చునా ! భారతములో నొక్కపదమైనను వ్యర్థమైనది యున్నదా ? అది శవాకారమా ? ఆహా ! ఏమిప్రసంగము !!!

వీరిటుల నుడువుచున్నను ప్రశస్తములనివ్రాసిన యతిప్రాసనియమములేని వీరిపద్యములందు వ్యర్థపదములు మెండుగానున్నవి. ఈవిషయమై " అభినవసరస్వతి, ఆగష్టుసంచిక " లో వ్రాయఁబడియున్నది. విస్తరభీతిచే నిందునుదాహరింపలేదు. పూర్వులను గ్రంథమంతయు వ్యర్థపదములతో నింపిరని నిందింపుచు వీరిట్లేల వ్యర్థపదములతోఁ దమ గ్రంథమును నింపిరో తెలియకున్నది. వీరిగ్రంథ మేయాకృతినో ? అన్నిటికంటెఁ దేలికయగువిషయ మితరుల తప్పులెన్నుట. కష్టతమమగుపంగతి తనలోపమును దాను గుర్తెఱుఁగుట, అది తెలిసికొన్నయెడల నేచిక్కును లేదు.

యతిప్రాసనియమములున్న కవిత నల్లుట కష్టతరమనియు, నవి లేనియెడల సులభసాధ్యమనియు వీరియభిప్రాయమైనటులఁ దోఁచుచున్నది. యతిప్రాసనియమము లేనంతమాత్రమునఁ గవిత రసవంతముగా

నుండదు. అంతమాత్రమున వ్యర్థపదములు పడకుండ నుండవు. సమర్థుల కసాధ్య మేదియు లేదు. కవితయుఁ గన్యయు రెండును సమానములు. వాని యిష్టమున్న నే రాణించునుగాని, యనిష్టమైనయెడలఁ బ్రయత్నించియు, విగతవస్త్రనుగాఁ జేసియు, రసాభాసఁ జేసిన వికటమై ప్రవర్తించుననుసంగతి యందఱెఱిఁగినదే.

యతిప్రాసనియమము లాంధ్రకవితాకన్యకకు వస్త్రధారణవంటివి. అవి లేనియెడల దిగంబరస్త్రీ యెంతరాణించునో యంతయే ! వీరు యతిప్రాసనియమములేక రచించిన పద్యములు విన సొంపులేక బట్టబయలుగా నున్నవని నాయభిప్రాయము.

యతిగణప్రాసవృత్తనియమము లుండఁబట్టియే యాంధ్రకవితామతల్లి దిగంబరిణిగాక సర్వాలంకారభూషితయై " దేశభాషలందుఁ దెలుగులెస్స " యన యశశ్చంద్రికల దిగంతములకు వ్యాపింపఁజేయఁ గలిగినది ! అటుల లేనియెడల

ఆ॥ వె॥ " కల్లు తాగవాలె నర్సిగా నే నిపుడు కల్లుముంత యిమ్ము
జల్దిగాను "

క॥ " అన్నము మింగినకుక్కను చంపినబాగుండు కర్రతేవే ! తేవే !

శా॥ చెప్పైనా యిటు వేగయిమ్ము అయయో ఆ తేలు జంపంగనూ
అబ్బబ్బాయిది నన్ను గుట్టె అయయో నే నోర్వలేన్ బాధకున్ ॥

క॥ " ఓసేయి నీతస్సగొయ్యా, సంపేతూ యిటుసూడు నాదు పెగ్గెను
దెబ్బకు "

" పిస్సిపిస్సిమాటలాడుతా వేమోసి, వోళ్లు యిర్గవాలనా నోరు
ముయ్యే "

అని వ్రాసినను గవితయే యగుచున్నది. ఇట్టికవిత యెంతయైనను నల్లవచ్చును.

మఱియొకసంగతి. వీరు గ్రామ్యభాషాప్రియులు. అందువల్ల వ్యాకరణముతోఁగూడ వీరికి నిమిత్తములేదు. ఆహా ! ఏమి ! ఆంధ్రభాషాదుస్థితి.

వీరికున్న పాండితికిదోడు - పూర్వుల నిందింపక వారల పథమునసే పోవుచు వారల స్తుతిపాత్రులుగాఁ జేయుట యనునదియున్న నెంతయో రాణించునది! అది మన యాంధ్రకవితామతల్లి దురదృష్టము గాఁబోలు!

ఉ॥ నన్నయభట్టు తిక్కకవినాథుఁడు నాచనసోమనాదులున్
"సన్నుతి పాత్రులౌ కవులు సత్యము వారికవిత్వరీతి బి
ట్టెన్నఁగ నాపితామహున కేనియు శక్యముగాదు! భక్తి మీ
అన్నుతిఁజేసి వారలకు రంజన మ్రొక్కెడివారు సత్కవుల్ ॥

క॥ వారలు చేసిన గ్రంథము
లారయ జీవంబు లగును నాంధ్రకవితకున్
వారల నిరసించుట యన
వేఱ ప్రాణంబు దీయువిధియే తలఁపన్.

తే॥ గీ॥ వారి గ్రంథంబులందున్న పద్యములను
నొక్కటైనను వ్యర్థపు ముక్కలేదు
ఎట్టిపద్యంబునందైన నెంతొ భావ
మొలుకు! వారల నిందకు నొప్పఁదగునె!

తే॥ గీ॥ యతియుఁ బ్రాసయు లేకుండ నాంధ్రకవిత
యనెడికన్య దిగంబర యగుచు మిడుకఁ
జేయకుఁడు! ప్రౌఢకవికర్ణ పేయమైన
పూర్వకవిమార్గమున మీరు పోవుఁడయ్య!

బాలకవి. జి. వి. సుబ్బయ్య శర్మ.



౯ గోటేటి వేణుగోపాలరావుగారు, పోలీసు సబిన్స్పెక్టరు, ప్రత్తిపాడు
౧౦ చిక్కా రాజా మట్టపల్లి రావుగారు, చెలకుర్తి.
౧౧ నారాయణరావుగారు, దాతారుపల్లె
౧౨ రంగరాజు గోపాలకిషన్ రావు దేశముఖు గారు-షాపురం.
౧౩ నూలూరి వెంకటరత్నంపంతులుగారు, గుంటూరు
౧౪ భాస్కరరాయుని వెంకట రామయ్యగారు, వంగపల్లి
౧౫ బుడంపాటి సుబ్బయ్యగారు, మర్చంట్, కాకినాడ
౧౬ బేలూరి రామన్న గుప్తగారు, సదాశివునిపేట
౧౭ రామారి సుబ్బయ్యగారు - శ్రీ శ్రీ విరూపాక్షసంస్థాన ప్రధానమంత్రి
౧౮ నుంటుంభట్లగారి వెంకటభుజంగముగారు - ముసలాపురం
౧౯ దండు గుండేరావుగారు, కరణము - ముసలాపురం
౨౦ తిగుళ్ళ కృష్ణారెడ్డిగారు. పటేలు - ముసలాపురం
౨౧ కప్పగంతు సుబ్బారావుగారు - పోలీసుసబిన్స్పెక్టరు - కొమ్మాలపాడు.
౨౨ రంగావఝ్ఝల రంగయ్యగారు, నర్సారావుపేట
౨౩ మండ చినవెంకయ్యగారు, దండమూడి.
౨౪ శ్యామాపంతుల గోపాలరావుగారు - హైదరాబాద్.
౨౫ తిరుమలనల్లాన్ చక్రవర్తి వరదాచార్యుల అయ్యవార్లంగారు - కొత్తాపురం
౨౬ కన్నయ్యగారి సంగయ్యగారు-ముసలాపురం
౨౭ చక్కిలం పాపయ్యగారు-ముసలాపురం
౨౮ తాళ్ళవలిస లింగన్న మొకద్దంగారు-గడిపెద్దాపురం
౨౯ శివన్ రావు దేశపాండ్యాగారు తాళ్ళపల్లి
౩౦ వెంకటరామయ్య, మక్తేదారుగారు - సీతారాంపురం
౩౧ సుబ్బారెడ్డి దేశముఖుగారు, శృంగసాగరం.
౩౨ కొంటుపల్లి రామారావుగారు, సంగెం
౩౩ చివుకుల శ్రీరామశర్మగారు- నాగులుప్పలపాడు
౩౪ రాయచూరి బండేరావుగారు, అయినాపురం.
౩౫ గజవాడ వెంకటాచార్యులుగారు, అల్లాదుర్గము
౩౬ కిరాల రామచంద్రయ్యగారు, మనుబాపురము
౩౭ లక్ష్మీనారాయణ గౌడు సెట్టిగారు, అందోలు
౩౮ కొండంభట్లగారి వెంకన్న గారు. గుమ్మడిదల
౩౯ లింగాల సీతారామరెడ్డి బండారెడ్డి దేశముఖుగార్లు-నారాయణపురం
౪౦ చెన్నూరి నరసింహారావు దేశపాండ్యాగారు-మెదవీడు.
౪౧ కందాళం కేశవాచార్యులుగారు-కిచ్చన్నపల్లె.
౪౨ కొంతుపల్లి అమృతరావుగారు-సంగెం.
౪౩ ముసని పాపిరెడ్డి మొకద్దంగారు-కొమ్మేపల్లె.
౪౪ మాణిక్యంగారి బాలచంద్రయ్యగారు-హైదరాబాద.
౪౫ చేకులపల్లి కృష్ణారెడ్డిగారు, కేశవాపురము.

# అభినవసరస్వతి

సంపాదకుఁడు - నాగరఖండస్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథకర్తయగు

జానపాటి పట్టాభిరామశాస్త్రి.

ఇది యొక మాసపత్రిక ఇందు వర్ణాశ్రమధర్మబోధక గ్రంథములును విమర్శనములును వ్యాసములును బ్రకటింపఁబడును. చందా సం॥ 1 కి రు 3-0-0

ఈ కార్యస్థానమున వెలకుదొరకు పుస్తకములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | కరిణీశోద్ధారిణి [వూరె వీరభద్రకవి] | ... | 0 | 4 | 0 |
| 2 | వాసంతికాపరిణయ నాటకము | ... | 0 | 4 | 0 |
| 3 | కంసవధ నాటకము | ... | 0 | 8 | 0 |
| 4 | చమత్కారమంజరి (సింహాద్రి వెంకటాచార్యులు) | | 0 | 4 | 0 |
| 5 | విరూపాక్షపీఠగురుపరంపర | ... | 0 | 2 | 0 |
| 6 | నీతిగీతులు (సుమతిశతకమునకు సంస్కృతము) | ... | 0 | 2 | 0 |
| 7 | విశ్వబ్రాహ్మణశబ్దఖండనము, బ్రాహ్మణశబ్దవిచారము | | 0 | 2 | 0 |
| 8 | విగ్రహారాధన ఖండనఖండనము | ... | 0 | 4 | 0 |
| 9 | చిత్తూరుజిల్లాతీర్పు విమర్శనము (పత్రికాధిపతి) | ... | 0 | 4 | 0 |
| 10 | సంగదోషము | ... | 0 | 3 | 0 |
| 11 | అస్పృశ్యతానివారణ ఖండనము(మల్లాది రామకృష్ణచయనులుగారు) | | 0 | 8 | 0 |
| 12 | వత్సలనీతిశతకము | ... | 0 | 1 | 0 |
| 13 | నర్సారావుపేట శతావధానము (తిరుపతివేంకటీయము) | | 0 | 3 | 0 |
| 14 | పశ్యశబ్దవిచారము | ... | 0 | 2 | 0 |
| 15 | పురశ్చరణము | ... | 0 | 2 | 0 |
| 16 | శంతనురాజచరిత్ర | ... | 0 | 14 | 0 |
| 17 | వర్ణవ్యవస్థ | ... | 0 | 4 | 0 |
| 18 | స్వర్ణకారవ్యవహారము | ... | 1 | 8 | 0 |
| 19 | శుద్ధాంధ్రహరిశ్చంద్ర చరిత్రము | ... | 0 | 10 | 0 |
| 20 | అభినవశాకుంతల నాటకము | ... | 0 | 8 | 0 |
| 21 | సూతసంహిత-ఆంధ్రము | ... | 2 | 0 | 0 |
| 22 | స్కాందమహాపురాణాంతర్గతనాగరఖండము ( ౧ సంపుటము ) | | 1 | 0 | 0 |
| 23 | డిటో నాగరఖండము (౨ సంపుటము) | | 1 | 8 | 0 |
| 24 | డిటో నాగరఖండము (3 సంపుటము) | | 1 | 8 | 0 |
| 25 | భారతీయప్రబోధము (పిడుపాటి చిదంబరశాస్త్రి) | | 0 | 4 | 0 |
| 26 | ధర్మనిర్ణయము. | | 0 | 4 | 0 |
| 27 | భారతకథాతత్త్వనిర్ణయము(మల్లాదిరామకృష్ణవిద్వచ్ఛయనులుగారు) | | 0 | 4 | 0 |

అభినవసరస్వతీ కార్యస్థానము, జానపాడు, పిడుగురాళ్ళపోస్టు,

గుంటూరు జిల్లా.